శ్రీరస్తు.

శ్రీవేంకటేశప్రసన్న:

జ్యోతిషశిఖామణియగు
శ్రీ మచ్ఛుకమహామునిగారిచే రచితమై తిరోహితంబైన

# మనోగతప్రశ్నోత్తర ప్రకాశిక శాస్త్రము

లేక

# లకోటా ప్రశ్నశాస్త్రము.

గ్రంధకర్త
కీర్తిశేషులైన బ్ర॥ గాడిచెర్ల కృష్ణరావుగారు.

ప్రకాశకులు.
జనోపకారిణీ స్టోర్సు,
ప్రొద్దుటూరు.

జానకీముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు.

1927.

 [వెల రు 0-4-

…స్తకములు, వార్తాపత్రికలు, నోటీసులు, సిల్కు, …
…మొదలగు చేతి గుడ్డలపైనను, గుడ్డలవలెనుండు వివిధవర్ణ…
…లతలుగల కాగితములమీదను, ఇంకనూ అనేకవిధములైన
శుభలేఖలు, కవరులు, హుండీలు, రశీదులు, బాండుబుక్కులు
భరాతంచీట్లు 2వ నం॥ ఫారంబుక్కులు వకాలతు మొదలగు
అన్నిఫారములు వగైరా లేవియైనను తెలుగు, ఇంగ్లీషు, మర…
…టి, భాషలలో క్రొత్తఅక్షరములతో కోరినకాలమునకు కో…
…నరంగులతో అందముగ ముద్రించి యివ్వగలము. ఇంకను
…మాలింగు, నంబరింగు పనులు చేయుటయేగాక బంగారుసిల్కు…
…తో, (లా) బుక్కులు భారతి, శారదా, బ్రహ్మనందిని, భ…
…తకథానిధి, మొదలగు మాసపత్రికలు. వగైరా బైండుపని
లేవియైనను మిగుల అందముగ చేసియివ్వబడును ఒక్కపర్యా…
…యము ఆర్డరు నిచ్చినవారికి మా జానకీముద్రాక్షరశాల పని…
…తనము విశదమగును. ఉత్తమోత్తమ అచ్చుపనులు మాక…
అందముగతయారుచేయించి పోస్టుద్వారా వీ.పీ. గా ప…
…ము. పోస్టులోపంపుఆర్డర్లు అడ్వాన్సుతో పంపప్రార్థితులు

## లక్కోటాప్రశ్నశాస్త్రము

గ్రంథకర్త బ్ర॥శ్రీ॥కీర్తిశేషులయిన గాడిచర్ల కృష్ణరావుగారు.
ఇందుపృచ్ఛకుడు ఏవిషయమై ప్రశ్ననడిగినదియు దానిని గురించి
…శుభాశుభములను బహుసులభముగా చెప్పవచ్చును ఇదిసంస్కృత శ్లోకము
…ను వాటికి సరియగు తెనుగుతాత్పర్యములతోను రచియింపబడినది. …
…సందిచేరి ఒకేతూరిప్రశ్నించినను వారివారికిందగు నుత్తరముల సముచిత…
…చెప్పవచ్చును. లక్కోటాప్రశ్నలు సహాచెప్పవచ్చును. వెల 0-4-0
…నలయుగారు జనోప… …స్టోర్సు, పొన్నూరు.

జ్యోతిష శిఖామణి యగు

శ్రీమద్భృగుమహామునిగారిచే రచితమై తిరోహితంబైన

# మనోగతప్రశ్నోత్తర ప్రకాశిక శాస్త్రము

గ్రంథకర్త

కీర్తిశేషులైన బ్ర॥ గాడిచెర్ల కృష్ణరావుగారు.

ద్వితీయముద్రణము.

ప్రకాశకులు.
జనోపకారిణిస్టోర్సు,
పొన్నూరు.

శ్రీజానకీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1927.

యరు పైన మనోగత ప్రశ్నోత్తర ప్రకాశిక

లేక లకోటా ప్రశ్నను గురించిన ప్రకటన.

ఈప్రపంచమునందు ప్రశ్నవిషయమైన శాస్త్రములనే
ములుకలవు గాని ప్రాయఃమనోగత ప్రశ్నోత్తర ప్రకాశిక
క లకోటాప్రశ్నయనునది లేదు. ఉండినను కృత్రిమమైనదిగాన
విద్వద్దూష్యముగను ఉన్నది. గాన నేనీవిషయమై అనేక
శాంతర గ్రంథపరిశీలన మహనీయుల శుశ్రూష చేయడము
టినిబట్టి నవీన మనోగతప్రశ్నోత్తర ప్రకాశిక యనుగ్రంథమ
రచియించినాడను.

ఇందువలన పృచ్ఛకుడు ఫలానావిషయమైన ప్రశ్ననడి
నాడనియు ఆకార్యమునుగురించిన శుభాశుభములీలాగు కలు
ననియు శ్లోకరూపముగా తేటపడును.

ఆదియెందు శ్రీపరమేశ్వరుడు పార్వతి దేవిగారికి ఉపదేశి
చగా దానినిబట్టి శ్రీశుకమునీంద్రులు గ్రంథమును రచియిం
రియు క్రమశః అది ఖిలపడిపట్టున్ను నాకొక యోగీశ్వరుడు
విని సిధిలగ్రంథమునుచూచి నాగురువులవారి పరమా
ప్రజనితమైన స్వశక్తికొలది సంస్కృతశ్లోకములు వాటికి
మముగా తేటపడులాగున సరియైన తెనుగుతాత్పర్యన
ముగా ఆంధ్రలిపితో రచియించినాడను.

ఈప్రశ్న చెప్పువారికి జ్యోతిషము తెలిసియుండవలయునసే
శ్యకముండదు. ఈగ్రంథమును చక్కగా కనిశించిరేని ప్ర
వారునుతమంతటతామే ఈప్రశ్నను చెప్పశక్తికలవారైయుం

గాడిచర్ల కృష్ణరావు,
గ్రంథకర్త.

| సంఖ్య | ప్రశ్న విభజన. | గ్రహగతి. నక్షత్రములు | పాదం | గ్రహములు. | |
|---|---|---|---|---|---|
| 1 | ప్రవాసిసుఖముగానున్నాడా ... | అశ్విని | 4 | రవిః | |
| 2 | పోయినపశువు దొరకునాలేదా ... | ఆశ్లేష | 4 | కేతుః | |
| 3 | తలచిన కార్యసిద్ధియగు నాలేదా ... | భరణి | 3 | చంద్రః | |
| 4 | నష్టద్రవ్యము లభించు నాలేదా ... | పుష్యం | 1 | రాహుః | |
| 5 | ఈభావితో వ్రాసిన నీరుపడు నాలేదా. ... | కృత్తిక | 2 | అంకః | |
| 6 | ప్రవాసి యిపుడువచ్చు నాలేదా ... | పునర్వసు | 4 | శనిః | |
| 7 | ఈతలచినకన్య లేక వరుడు లభించునా లభించదా ... | రోహిణి | 1 | బుధః | |
| 8 | ఈవ్యాపారములో లాభమానష్టమా ... | ఆర్ద్ర | 2 | శుక్రః | |
| 9 | తలచిన యిల్లు భూమి తీసుకొనుటచే లాభమా లేదా ... | మృగశిర | 3 | గురుః | |
| 10 | ఈవ్యాధి పరిహారమగు నాలేదా ... | మఖ | 4 | రవిః | |
| 11 | ఈతలచినప్రయాణం నడచునాలేదా ... | జ్యేష్ఠ | 1 | కేతుః | |
| 12 | ఈవిపత్తు పరిహారమగు నాకాదా ... | పుబ్బ | 3 | చంద్రః | |
| 13 | ఈవివాహమిపుడు జరుగునాజరగదా ... | అనూరా | 4 | రాహు | |
| 14 | ఈపెసుఖముగా ప్రసవించునా ... | ఉత్తర | 2 | అంకః | |
| 15 | ఈసంబంధము యుక్తమైనదా కాదా ... | విశాఖ | 2 | శనిః | |
| 16 | ఈగర్భిణిస్త్రీ యేబిడ్డనుకనును ... | హస్త | 1 | బుధః | |
| 17 | ఈకుటుంబమునకు సంతుకలదాలేదా ... | స్వాతి | 1 | శుక్రః | |
| 18 | ఈశిశువునకుఆయుర్వృద్ధికలదాలేదా ... | చిత్త | 3 | గురుః | |
| 19 | ఇతనుపరీక్షలో ప్యాసుఅవునాకాదా... | మూల | 4 | రవిః | |
| 20 | ఈఋణము తీరునాతీరదా ... | పూ॥భా | 2 | శనిః | |
| 21 | ఈవ్యవహారము జయించునాలేదా ... | పూ॥షా | 3 | చంద్రః | |
| 22 | ఇతనుచదవరివిద్వాంసుడౌనాకాడా ... | శతభి॥ | 3 | శుక్రః | |
| 23 | ఇపుడీకార్తిలో వర్షముకలదాలేదా ... | ఉ॥షా | 2 | అంకః | |
| 24 | వెలలు హెచ్చునా తగ్గునా ... | ధనిష్ట | 4 | గురుః | |
| 25 | సస్యవృద్ధియగునాకాదా ... | శ్రవణ | 1 | బుధః | |

1

ను
మందిచేరి
గా చెప్పవచ్చును.
వలయు

గ్రిహాణేలాభనష్టేచైవ యథాక్రిమం। ...

రేలాభనష్టేచ ప్రోషితాగమనంతథా॥

,, నష్టద్రివ్యస్యలాభేతు పశో రాగమనేతథా। రోగిదేహా

కూలేతు సంప్రాప్తవిపదః కృతే॥

,, సుఖప్రసవస్యవిషయే జ్ఞానంగర్భస్థితశిశోః। శిశోరాయు

పరిజ్ఞానంసంతానవిషయంతథా॥

,, యుక్తాయుక్తంచసంబంధే వివాహవిషయంతథా। ప్రి

నేచపరీక్షాయాం వ్యాజ్యేజయపరాజయా॥

,, కార్తావృష్టిపరిజ్ఞానం సస్యవృధౌచభూతలే। విపణ్యాంప

ల్యవృద్ధిశ్చవిద్యావృద్ధౌతతఃపరం॥

,, ఋణాన్ముక్తోభవేద్వాకిం నభవేదథనిశ్చయాత్। ప్రశ్నే

శ్నస్యవిషయాః పంచవింశతిసంఖ్యకాః॥

## తాత్పర్యము.

| | |
|---|---|
| 1 ప్రివాసీసుఖవిషయము. | 2 కార్యసిద్ధివిషయము. |
| 3 భావిలోనీరుపడువిషయము | 4 కన్యావరలబ్ధవిషయము. |
| 5 గృహ. భూగ్రిహణమందు కలుగు లాభనష్టవిషయము. | |
| 6 వ్యాపారలాభనష్టవిషయం. | 7 ప్రివాసివచ్చువిషయము. |
| 8 నష్టద్రివ్యలాభవిషయము. | 9 గతపశ్వాగమన విషయము. |
| 10 రోగిదేహానుకూలవిషయము. | 11 సంప్రాప్తవిపత్పరిహార విషయం |
| 12 సుఖప్రసవ విషయము. | 13 గర్భస్థశిశుపరిజ్ఞానము |
| 14 శిశువు ఆయుఃపరిజ్ఞానము | 15 సంతుప్రాప్తివిషయము. |
| 16 సంబంధయుక్తాయుక్త విషయము | 17 వివాహవిషయము. |
| 18 ప్రియా[illegible]యము. | 19 పరీక్షాప్యాసు విషయము. |
| 20 వ్యవహార జయపరాజయం | 21 కార్తివృష్టివిషయము. |
| 22 సస్య[illegible]ద్ధి విషయము. | 23 మూల్యవృద్ధివిషయము. |
| 24 విద్యా[illegible]ద్ధి విషయము. | 25 ఋణవిముక్తి విషయము. |

## ప్రశ్నావలోకనవిధిః

దృ॥ ఆదౌపృచ్ఛకహస్తే ప్రశ్నపత్రికాందత్వాతద్గత ప్రశ్నేషుయదభిలషితం తన్మనసి నిధాయతదన్యత్పత్రేలిఖిత్వా బంధనంకృత్వా నిక్షేపేతివక్తవ్యం॥ 1

తా॥ పృచ్ఛకుడిచేతికి ప్రశ్నపత్రికనిచ్చి అందలి ప్రశ్నలలో వలయు దానిని మరివకపత్రములో వ్రాసి దానిని బంధించి యుంచుకొనుమని చెప్పవలయును.

దృ॥ తదనుయదభిలషిత ప్రశ్నః తత్పంక్తౌస్థితనక్షత్ర పాద గ్రిహాః। తథాఅష్టోత్తరశతసంఖ్యాయాం త్ర్యంకాన్వదేతి విచార్యతన్మేళయిత్వా ద్వాదశభిర్విభజ్యశేషంచ, గ్రాహ్యం॥ 2

తా॥ పిమ్మట ప్రశ్నపత్రికలోని కోరిన ప్రశ్న పంక్తికి కడపటనున్న నక్షత్ర, పాద, గ్రిహములను, నూటయెనిమిది సంఖ్యలో మూడుఅంకములను చెప్పుమని యడిగి తెలుసుకొని ఆమూడంకములనుకూడి పన్నెండుచే భాగించి శేషమును కనిపెట్టి దానిని మనస్సునందుంచుకొనవలయును.

దృ॥ అథైతద్గ్రింథస్థ (6) పుటేవిద్యమాన ద్వాదశనాడ్యాత్మకచక్రిస్థ శేషాంకె, తథాఅశ్విన్యాది పృచ్ఛకప్రోక్తఋక్షపర్యంతంగణనాంకృత్వా తచ్చక్రిస్థ పుటసంఖ్యాసు శేషాంకనాడీతలస్థతత్సమానపుటసంఖ్యాంచ లక్షేస్థాపయేత్॥ 3

తా॥ పిమ్మట ఈపుస్తకములోని [6] పుటలో ద్వాదశనాడ్యాత్మక చక్రమునందలి శేషాంకమునున్ను, అదేనాడియందలి అశ్విన్యాదిగా పృచ్ఛకుడు చెప్పిన నక్షత్రింవరకు ఎంచగా యెన్నియగునో అన్నవశేషాంక నాడీకి క్రిందిపుటసంఖ్యనున్ను గుర్తుపెట్టుకొనవలయును.

...లునుపుస్తకేస్మిన్ తత్సంఖ్యాకపుటంపశ్యేత్ తస్మి
పుటే ద్వాదశనాడ్యాత్మక చక్రగత శేషాంకతలస్థ
కసంఖ్యాయాస్తు సంఖ్యాకశ్లోకం పశ్యేత్తత్
ప్రాశ్నికాభిప్రాయంచ తదుత్తరంచ స్ఫుటంభవేత్.

తా। అటుతర్వాత ఈపుస్తకములోని ద్వాదశనాడ్యాత్మక చక్రస్థిత ... ఖ్యగల పుటనుతీసి శేషాంకముక్రింది శ్లోకసంఖ్యకు సమమైనశ్లోక ... ను, తాత్పర్యమును చూచినచో ఫలానావిషయమైన ప్రశ్నయని ... దానిపర్యవసానమిట్లు పరిణమించుననియు తేటపడును.

గద్య। పశ్చాద్దైవజ్ఞః శుభ్రపత్రికాయాం పృచ్ఛకస్యాభిప్రా
యం తదుత్తరంచ విలిఖ్యపృచ్ఛకహస్తేవామధ్యవర్తి
హస్తేవాదాతవ్యం॥

తా। వెంటనే జ్యోతిష్కుడు తెల్లకాగితమునందు ప్రశ్న తదభిప్రాయ ... ను వ్రాసి పృచ్ఛకునిచేతగాని లేదా మధ్యవర్తిచేతగాని యివ్వ ... యును.

శ్లో। ఏతేనపృచ్ఛకోద్దేశముత్తరంచ స్ఫుటంభవేత్। తస్మా
ద్ధయం శ్లాఘ్యత్వ మాప్నుయాద్గణకోభువి॥

తా। ఇందువలన పృచ్ఛకుని యభిప్రాయము, ఉత్తరము, తేటయగు ... అందుచే జ్యోతిష్కుడు పూజ్యుడగును.

శ్లో। విస్తరాచ్ఛాస్త్రనివహాత్సంప్రగృహ్యకృతంత్విదం। సంక్షే
తశ్చబాలానామవగాహనసిద్ధయే॥

తా। విస్తారమగు ఈప్రశ్నశాస్త్ర సమూహములోనుండి సామాన్యముగ బాలకులకు సహా ప్రాథ్యపడులాగున సంక్షేపగ్రంథము ను రచియించినాడ ...

శ్లో। ఏతేనసంతస్సంతుష్టామమలోపమిహాస్థితం। క్షంతవ్య
మియాచేతాః సర్వజ్ఞాః ప్రార్థితానహం॥

తా। ఇందుగల లోపములను సజ్జనులు సాత్వికగుణము కలవారుగ క్షమించవలయునని యాచించెదను.



ద్వాదశనాడ్యాత్మక చక్రము

| | 0 | I | II | III | IV | V | VI | VII | VIII | IX | X | XI | శేషాంకము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 0 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | |
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | శ్లోకసంఖ్య. |
| 1 | 14 | 16 | 18 | 20 | 22 | 24 | 1 | 3 | 5 | 7 | 10 | 12 | |
| 2 | 13 | 15 | 17 | 19 | 21 | 23 | 25 | 2 | 4 | 6 | 9 | 11 | |
| 3 | 20 | 22 | 24 | 1 | 3 | 5 | 8 | 10 | 12 | 14 | 16 | 18 | |
| 4 | 15 | 17 | 19 | 21 | 23 | 25 | 2 | 4 | 6 | 9 | 11 | 13 | |
| 5 | 1 | 3 | 5 | 8 | 10 | 12 | 14 | 16 | 18 | 21 | 23 | 24 | |
| 6 | 18 | 20 | 21 | 24 | 25 | 1 | 3 | 6 | 8 | 12 | 14 | 16 | |
| 7 | 22 | 24 | 8 | 2 | 4 | 6 | 7 | 12 | 14 | 16 | 18 | 20 | |
| 8 | 19 | 21 | 23 | 25 | 1 | 3 | 5 | 9 | 11 | 13 | 15 | 17 | |
| 9 | 10 | 12 | 15 | 17 | 19 | 2 | 23 | 1 | 22 | 5 | 7 | 8 | |
| 10 | 7 | 9 | 11 | 14 | 16 | 18 | 20 | 22 | 25 | 1 | 3 | 5 | |
| 11 | 8 | 10 | 12 | 13 | 15 | 17 | 21 | 24 | 1 | 3 | 4 | 6 | |
| 12 | 25 | 2 | 4 | 6 | 8 | 10 | 12 | 14 | 16 | 19 | 21 | 23 | |
| 13 | 5 | 7 | 9 | 10 | 12 | 14 | 16 | 18 | 20 | 22 | 25 | 3 | |
| 14 | 11 | 13 | 16 | 18 | 20 | 22 | 24 | 7 | 3 | 2 | 5 | 9 | |
| 15 | 9 | 11 | 13 | 16 | 18 | 21 | 22 | 25 | 2 | 4 | 6 | 7 | |
| 16 | 12 | 1 | 3 | 4 | 6 | 8 | 10 | 17 | 19 | 23 | 24 | 15 | |
| 17 | 16 | 18 | 22 | 23 | 2 | 4 | 6 | 8 | 10 | 24 | 12 | 14 | |
| 18 | 6 | 8 | 10 | 12 | 14 | 16 | 19 | 21 | 23 | 25 | 2 | 4 | |
| 19 | 24 | 5 | 7 | 9 | 11 | 13 | 15 | 19 | 21 | 18 | 20 | 22 | |
| 20 | 4 | 14 | 20 | 15 | 24 | 19 | 17 | 23 | 9 | 8 | 1 | 2 | |
| 21 | 2 | 4 | 6 | 7 | 9 | 11 | 13 | 15 | 17 | 20 | 22 | 25 | |
| 22 | 17 | 19 | 1 | 22 | 13 | 20 | 4 | 5 | 7 | 11 | 8 | 10 | |
| 23 | 21 | 23 | 25 | 3 | 5 | 7 | 9 | 11 | 13 | 15 | 17 | 19 | |
| 24 | 3 | 6 | 14 | 11 | 17 | 15 | 18 | 20 | 24 | 10 | 13 | 1 | |
| 25 | 23 | 25 | 2 | 5 | 7 | 9 | 11 | 13 | 15 | 17 | 19 | 21 | |

శ్లోక పుటసంఖ్యలు

,, లాభమేవభవేత్కష్టాత్ భూగేహగ్రహణేఘన...
తా॥ భూమియిల్లు తీసుకొనుటచే లాభమేకలదు.
2 ,, ఏతత్సంబంధతో సత్యం సమీచీనం భవిష్యతి॥
,, ఈసంబంధముతో సత్యముగ మంచికలుగును.
3 ,, యావత్ఫలంతిసస్యాని తావత్తైవసుఖీభవ॥
,, పండినపైరుతోనే సుఖముగనుండవలెను.
4 ,, ఏతత్కూపస్యఖననాత్ జలప్రాప్తిర్నవిద్యతే॥
,, ఈభావిత్రవ్వుటచే జలములభించదు.
5 ,, నష్టద్రవ్యమిదం గేహమధ్యభాగేచవర్తతే॥
,, ఈనష్టద్రవ్యము ఇంటిమధ్యభాగమందే వున్నది.
6 ,, వ్యాపారేస్మిల్లాభలేశో నసంభవతినిశ్చయం॥
,, ఈవ్యాపారమునందు లాభములేశమైననుండదు.
7 ,, ప్రోషితస్యసుఖంశీఘ్రం సంభవిష్యతినాన్యథా॥
,, ప్రవాసికి శీఘ్రముగ సుఖముకలుగును.
8 ,, పశుఃశేషసమాయాతి శీఘ్రంత్యజమనోవ్యథాం॥
,, ఈపశువు శీఘ్రముగవచ్చును చింతవలదు.
9 ,, ప్రాప్తమేతద్విపత్శీఘ్రం పరిహారం ప్రయాస్యతి॥
,, ఈవిపత్తు శీఘ్రముగ పరిహారమగును.
10 ,, శ్రీశానుగ్రహాత్ ప్రాప్త రోగమేతద్వినస్యతి॥
,, శ్రీహరికృపచే ప్రాప్తరోగము పరిహారమగును.
11 ,, వివాదేస్మిన్ జయప్రాప్తిః భగవత్కృపయాభవేత్॥
,, ఈవివాదము శ్రీహరికృపతో జయించును.
12 ,, అయమప్రాప్యకాలత్వాద్విద్యాలాభేతు సంశయ...
,, ఇదికాలనికాలముగాన విద్యలభించుట దుస్తరము...

1 శ్లో॥ అధికావృష్టిరిత్యేవ సంభావయితుమర్హసి॥
తా॥ వృష్టియధికమని భావించుకొనుము.
2 ,, ప్రవాసేస్మిన్ సుఖంప్రాప్య పశ్చాత్కష్టీభవిష్యతి॥
,, సుఖముగప్రవసించి ఆవలకష్టపడును.
3 ,, ఋణాద్విముచ్యతేతస్మాత్సుఖీస్యాన్నాత్రసంశయః॥
,, ఋణవిముక్తికలిగి అందుతో సుఖపడును
,, ప్రవాసీశీఘ్రమాయాతి సుఖీభూత్వాప్రవాసతః॥
,, ప్రవాసి సుఖపడి శీఘ్రముగ వచ్చును.
5 ,, వివాహవిషయేబాస్మిన్ బహుశః సిద్ధిమాప్నుయాత్
,, వివాహవిషయమై బహుశః సిద్ధిపొందును.
6 ,, అయంపశుర్గతస్తేద్య నలభ్యశ్శీఘ్రతఃఖలు॥
,, ఈపోయిన పశువు శీఘ్రముగ లభించదు.
7 ,, లభ్యాఃకన్యావరాతస్మాల్లాభోనాస్తి విచారతః॥
,, కన్యావరులు లభింతురు అందుచే లాభముండదు.
8 ,, కార్యమేతద్భవత్యేవ సహాయాదితరస్యచః
,, ఈకార్యమితరసహాయముచే సిద్ధియగును.
9 ,, ప్రాతికూల్యాచ్చకాలస్యపశ్చాత్సంతానమాప్నుయుః॥
,, కాలప్రతికూలమునుబట్టి పిమ్మట సంతానమగును॥
10 ,, పూర్ణాయుష్మాంశ్చకష్టే నజీవితుంశక్యతేశిశుః॥
,, ఈశిశువుకు పూర్ణాయుస్సుకలదు కష్టముగజీవించును
11 ,, ఏతత్ప్రయాణే విఘ్నాఘాః సంభవిష్యంతినాన్యథా
,, ఈప్రయాణమున విఘ్నములు సంభవించును.
12 ,, ఏతద్వ్యాజ్యేజయఃప్రాయః సంభవిష్యతినిశ్చయం॥
,, ఈవ్యాజ్యమున ప్రాయఃజయముకలుగును.

...నుకూలన్నం ప్రాప్తః శీఘ్రం విద్యావ్యభివిష్య[తి]

తా॥ అనుకూలకాలముగాన త్వరలో విద్యావంతుడగును.

2 ,, భూగేహగ్రహణేలాభ లేశోనాస్తి కదాచన॥

,, భూమియిల్లుపొందుటచే లేశలాభము లేదు.

3 ,, ఏతస్మాదుత్తమం నాన్యత్సంబంధేచ భవిష్యతి॥

,, దీనికంటె మరియొకటి మంచిసంబంధము లేదు.

4 ,, మూల్యంవృద్ధిమవాప్యైవ పశ్చాత్ క్షీణత్వమాప్స్యతే

,, వెలహెచ్చి పిమ్మట తగ్గిపోవును.

5 ,, కూపస్యఖననేచాస్మిన్నష్టం నాప్నోతినిశ్చయం

,, ఈబావిత్రవ్వుటవలన నష్టముకలుగదు

6 ,, నష్టద్రవ్యస్యలాభోయమనర్ధ్యమితిరోచతే॥

,, ఈనష్టద్రవ్యములభించుట యనర్ధ్యము.

7 ,, వ్యాపారేస్మిన్ స్వల్పలాభో సంభవిష్యతినాధికం॥

,, ఈవ్యాపారమున స్వల్పలాభము కలుగును.

8 ,, మానరుపాధ్యధునాప్రశ్నం ప్రవాసిసుఖసంస్థితౌ॥

,, ప్రవాసిసుఖవిషయమై ఇపుడడుగవలదు.

9 ,, శిశోరాయుః పరిజ్ఞానే కాలదోషాన్నశక్యతే॥

,, కాలదోషతః శిశువుఆయుర్దాయము చెప్పనలవికాదు

10 ,, అస్యాంవిపత్తౌ యత్కించిత్కష్టమస్త్యేకనాన్యథా॥

,, ఈపదవియందు క్వచిత్కష్టముకలదు.

11 ,, ప్రాణాపాయం రోగిణోస్య సంభవేదితిసూచ్యతే॥

,, ఈరోగికి ప్రాణాపాయంకలదని తోచినది.

12 ,, కన్యోత్పత్తిర్భవత్యేవ తస్మాత్కష్టమవాప్నుయాత్॥

,, కన్యక జనియించును. అందుచే కష్టముకలుగును.



1 శ్లో॥ వ్యవహారే జయప్రాప్తౌ సంశయోత్ర...

తా॥ వ్యవహారజయప్రాప్తివిషయమై సంశయముకలదు.

2 ,, వృష్టౌసందేహమత్రైవ గ్రహాణాంగతివ్యత్యయాత్॥

,, గ్రహగతినిపట్టి వృష్టివిషయమై సందేహముకలదు.

3 ,, బుద్ధిమద్దూతికాలాభాత్సుఖేనైవ ప్రసూయతే॥

,, బుద్ధిశాలియగు దూతికతో సుఖప్రసవమగును.

4 ,, యుక్తమేవహి సంబంధాత్కమన్యత్పరిపృచ్ఛసి॥

,, ఇది యుక్తమైన సంబంధముగాన విచారమువలదు.

5 ,, ప్రవాసీశీఘ్రమాయాతి చింతాంత్యజసుఖీభవ॥

,, పరివాసి శీఘ్రముగావచ్చును. చింతమాని సుఖముగనుండుము.

6 ,, సిద్ధిర్భవేద్వివాహస్య పశ్చాత్కష్టీ భవిష్యసి॥

,, వివాహసిద్ధియగును తర్వాత కష్టపడుదువు.

7 ,, సస్యవృద్ధిర్భవేదేవ సమీచీనతయాధునా॥

,, ఇప్పుడు చక్కగా సస్యవృద్ధియగును.

8 ,, కన్యావరౌ ప్రలబ్ధ్వాపి కష్టభాగీభవిష్యసి॥

,, కన్యావరులు లభించియు కష్టపడుదువు.

9 ,, విఘ్నానామతిబాహుళ్యాత్కార్యసిద్ధిర్హిదుస్తరా॥

,, విఘ్నాధిక్యముచే కార్యసిద్ధి దుస్తరము.

10 ,, సంతానమధునానాస్తి కాలతఃప్రతిపద్యసే॥

,, సంతానమిపుడులేదు క్రమశఃకలుగును.

11 ,, ఏషావిపన్నాశమేతితుషారఇవభాస్కరాత్॥

,, ఈవిపత్తు పరిహరించును.

12 ,, ప్రయాణసంభవేనాస్తి సందేహఃకాలదేశతః

,, ఈప్రయాణమిపుడుకలుగును.

శ్లో॥ 1 పుత్రోత్పత్తిర్భవత్యేవ సంప్రవర్ధతి కాలతః॥
తా॥ పుత్రోత్పత్తియై క్రమముగ వృద్ధినొందును.
2 ,, వత్సరేస్మిన్పరిక్షాయాం జయీభవతినిశ్చయం॥
,, ఈతూరిపరీక్షలో జయమును పొందును.
3 ,, సంప్రాప్తాయదిభూగేహా తదాదుఃఖీభవిష్యసి॥
,, ఇల్లుభూమి లభించినను సుఖముండదు.
4 ,, నలభ్యతేధునాముక్తిః ఋణాత్శీఘ్రమవాప్స్యసి॥
,, ఇపుడు ఋణముతీరదు శీఘ్రముగా నేతీరును.
5 ,, ఏతన్మాల్యంస్థిరంనస్యాత్కించిత్కాలంహిత్నిష్ఠతి॥
,, ఈవెలస్థిరముకాదు కొంతకాలముండును.
6 ,, లభ్యతేచోదకంకూపే బహుకాలంనతిష్ఠతి॥
,, కూపమునందు ఉదకంపడినను త్వరలో యిముకు
7 ,, పరహస్తంగతంనష్టం కష్టమాగమనేపునః॥
,, నష్టద్రవ్యము పరులచే దొరికినది రావడంకష్టం
8 ,, యదాసమ్యక్ప్రవృద్ధేత తదాదృష్టం విభావయ॥
,, చక్కగావృద్ధిపొందెనేని అదృష్టమనితలువుము.
9 ,, ప్రవాసివిషయేచింతాం త్యజనోచేత్సుఖంనహి॥
,, ప్రవాసివిషయమై చింతవిడువుము సుఖముగలుగ
10 ,, గతస్తేపశురాయాతి శీఘ్రమేవనసంశయః
,, పోయినపశువు శీఘ్రముగవచ్చును.
11 ,, శిశోరాయుఃపరిజ్ఞానేహ్యయంకాలశ్చనోచితః
,, శిశువు ఆయుఃపరిజ్ఞానమునకిది సమయముకాదు.
12 ,, నవైద్యాత్స్వస్థతాంయాతి రోగోయం హీనసం
,, ఈరోగము సమీచీన వైద్యునితో స్వస్థమగును.

శ్లో॥ ప్రయాణమేతచ్ఛీఘ్రంహిసంభవిష్యతిసర్వశః॥
తా॥ ఈప్రయాణము శీఘ్రముగ సిద్ధించును.
,, కించిత్కాలవిలంబేన చాయంవివాహోభవిష్యతి॥
,, వివాహకాలవిలంబమున వివాహమగును.
,, ప్రవర్తత్యేవనా స్యస్మిన్విషయేసంశయఃక్వచిత్॥
,, వర్షించును, యీవిషయమై సంశయపడవలదు.
,, యత్కించిత్కష్టమాప్నోతి ప్రసవేస్మిన్నసంశయః
,, ఈప్రసవవిషయమై యత్కించిత్కష్టపడును.
,, సంబంధోయంయుక్తఇతి నమంతవ్యంనిరీక్ష్యతాం॥
,, ఈసంబంధము యుక్తమని తలపక నిరీక్షించుము.
,, ప్రవాసీనోపయాత్యద్య కించిత్కాలంనిరీక్ష్యతాం॥
,, ప్రవాసి యిపుడురాడు కొంతకాలం నిరీక్షించుము.
,, కల్యాణమేతద్యత్నేన సంభవిష్యతినాన్యథా॥
,, ఈవివాహము యత్నతః సంభవించును.
,, వ్యాపారేకష్టతోలాభమాప్నోష్యేవనసంశయః॥
,, ఈవ్యాపారమునందు కష్టతః లాభముకలదు.
,, కాలోయంనసమీచీనః వరకన్యాప్రయేధునా॥
,, కన్యావరప్రాప్తివిషయమై ఇపుడు మంచికాలంకాదు.
,, కార్యసిద్ధిర్భవత్యేవ అన్యథానభవేత్క్వచిత్॥
,, కార్యసిద్ధియగునేగాని మరియొకటికాదు.
,, సంతానంకాలతఃప్రాప్య మధునానైవలభ్యతే॥
,, సంతానమిపుడుకలుగదు కాలతఃసిద్ధించును.
,, విపత్తిరేషాసంప్రాప్తానాశమేష్యతిచాన్యతః॥
,, ఈవిపత్తు మరివకనితో తప్పిపోవును.

శ్లో॥ భవితవ్యం హి దైవేన చైతద్వ్యాధినివారణం।
తా॥ ఈవ్యాధి దైవయత్నతః నివారింపతగినది.
2 ,, కన్యాలాభో భవేదేవ గర్భాదస్మిన్న సంశయః।
,, ఈగర్భతః కన్యాలాభమగును.
3 ,, పరీక్షాయాం జయప్రాప్తిరాశ్చర్యాత్సంభవిష్యతి।
,, పరీక్షలో జయము ఆశ్చర్యముగ లభించును.
4 ,, మధ్యసృష్టిర్భవత్యేవ కాలగత్యా న సంశయః।
,, కాలగతితో మధ్యసృష్టియగును.
5 ,, గ్రహచారవశాదద్య ఋణముక్తిర్న లభ్యతే।
,, గ్రహచారవశాదిపుడు ఋణముక్తిలభించదు.
6 ,, మూల్యవృద్ధిర్భవత్యేవ పశ్చాత్ క్షీణమవాప్నుయాత్
,, యిపుడు వెల హెచ్చి తర్వాతతగ్గును.
7 ,, అధునా నైవమాత్యేవ ప్రవాసీ సుఖయోగతః
,, ప్రవాసి సుఖయోగమును బట్టి ఇపుడు రాడు
8 ,, శిశోరాయుఃపరిజ్ఞానం వక్తుం నార్హామి బాధునా।
,, శిశువు ఆయుర్దాయవిషయమై ఇప్పుడు చెప్పవీలులే
9 ,, కించిన్న్యూనాధికత్వేన సస్యవృద్ధిర్భవేదలం।
,, కొంచెము హెచ్చుతక్కువ సస్యవృద్ధియగును.
10 ,, ప్రవాసీతరసాంగత్యాత్సుఖీ స్యాన్నాత్ర సంశయః।
,, ప్రవాసి యితరసహాయముతో సుఖముగనున్నాడు.
11 ,, విషయేతు పశోరస్య హ్యనుమానం త్యజాధునా।
,, ఈపశువిషయమై అనుమానమును విడువుము.
12 ,, భవత్యేవహి సంతానం తస్మాన్నాస్తి సుఖం తవ।
,, సంతానమగుచున్నది అందుచే సుఖము లేదు.

1 శ్లో॥ ఆదావలక్ష్యా భూత్వా సా విపదంతే చ కష్టదా।
తా॥ ఈవిపత్తు మొదట అలక్ష్యమై తర్వాత బాధించును.
2 ,, ప్రయాణాదధునా కష్టీ భవిష్యసి న సంశయః।
,, ప్రయాణమువలన ఇప్పుడు కష్టపడుదువు.
3 ,, అధునా నోపయాతీహ ప్రవాసీ కార్యగౌరవాత్।
,, ప్రవాసియిపుడు కార్యగౌరవమును బట్టి రాడు.
4 ,, గృహభూంగ్రహణేచాద్య లాభ ఏవ న సంశయః॥
,, ఇపుడు యిల్లుభూమితీయుటచే లాభముకలదు.
5 ,, సుఖప్రసవస్య విషయే కాలతో నవదామ్యహం॥
,, సుఖప్రసవవిషయమై కాలతః చెప్పతగదు.
6 ,, యుక్తాయుక్తే హి సంబంధే వక్తుం నార్హామి చాధునా॥
,, సంబంధములో యుక్తాయుక్తములను చెప్పవీలులేదు.
7 ,, కూపేస్మిన్నుదకప్రాప్తౌ వక్తుం నార్హామి కాలతః॥
,, ఈబావిలో నీరుపడువిషయమై కాలతః చెప్పచాలను.
8 ,, కల్యాణమేతదన్యస్య సహాయాత్సంభవిష్యతి॥
,, ఈవివాహము ఇతరసహాయముచే సంభవించును.
9 ,, వ్యాపారేస్మిన్ వృథాయాసః లాభలేశో న విద్యతే॥
,, ఈవ్యాపారమునందు ఆయాసమేగాని లాభంలేదు.
10 ,, వ్యవహారేదయం ప్రాప్య చింతాయుక్తో భవిష్యసి।
,, వ్యవహారజయమును పొందియు చింతమానదు.
11 ,, సస్యవృద్ధౌ హి సందేహః కాలతో వచ్మి నాన్యథా॥
,, కాలతః సస్యవృద్ధివిషయమై సందేహముగనున్నది
12 ,, లభ్యోయం పశురద్యైవ త్యజ శోకం మనోగతం॥
,, పశువు ఇపుడే లభించును. చింతమానుము.

శ్లో॥ సంతానవిషయేప్రశ్నః కాలతో దూష్యతేధునా।
తా॥ ఇపుడు సంతానవిషయమై ప్రశ్నచేయవలదు.
2 ,, రోగోయంసాధ్వసందత్వా పశ్చాద్గఛతినాన్యథా।
,, ఈరోగము భయపెట్టి మానును.
3 ,, గర్భాదస్మాత్సుపుత్రస్తు జాయతేచాధునాధ్రువం।
,, ఈగర్భతః సుపుత్రుడుగలుగును.
4 ,, జయప్రాప్తౌపరీక్షాయాం సంశయోస్తిహిరీక్షయ।
,, పరీక్షాజయవిషయమై ఇపుడు సంశయముగనున్నది
5 ,, యత్కించిద్వృష్టిరస్తీతిరోచతేమమకాలతః।
,, కాలతఃస్వల్పవృష్టియగునని తోచుచున్నది.
6 ,, ఇతోధికవిముక్తిర్హి ఋణాన్నాస్తినసంశయః।
,, ఇంతకుమించి ఋణవిముక్తికాచాలదు.
7 ,, వృద్ధిహ్రాసౌతుమాల్యశ్య దేశకాలాద్భవిష్యతః।
,, మాల్యవృద్ధిక్షీణములు కాలానుగుణముగయగును
,, వృథావ్యయంకరోష్యేవ నష్టంతన్నైవలభ్యతే।
,, వృథా శెలవుచేసెదవు నష్టద్రవ్యము లభించదు.
9 ,, వ్యవహారేసావకాశాజ్జయమాప్నోతనాన్యథా।
,, వ్యవహారజయము సావకాశముగ పొందుదువు.
10 ,, లబ్ధ్వాపివరకన్యేతు లాభాధిక్యం నవిద్యతే।
,, కన్యావరులు లభించియు అధికలాభముండదు.
11 ,, కార్యసిద్ధిఃప్రయాసేన సంభవిష్యతినాన్యథా।
,, ప్రయాసతో కార్యసిద్ధియగును.
12 ,, ఆయురస్తిశిశోరస్య చికిత్సాంకురుయత్నతః।
,, ఈశిశువుకు ఆయుస్సుకలదు చికిత్స చేయుము.



1 శ్లో॥ లభ్యతేతేపశుశ్శీఘ్రం చింతాంత్యక్త్వాహం
తా॥ నీపశువు శీఘ్రముగ దొరుకును చింతవిడువుము.
2 ,, కష్టసాధ్యావిపచ్చైషాపరిహర్తుమిహాధునా॥
,, ఈవిపత్పరిహారమునకు కష్టపడవలెను.
3 ,, త్వరాంమాకురువాస్మిన్నైవప్రయాణేకార్యగౌరవాత్
,, ఈప్రయాణమునందు త్వరపడవలదు.
4 ,, గర్భాదస్మాత్పుత్రికాప్తిర్జాయతేనాన్యథాభవేత్॥
,, ఈగర్భతః పుత్రికోత్పత్తి అగుచున్నది.
5 ,, గృహాత్కష్టమాప్నోషి భూమ్యాగేహస్యచాధునా।
,, భూమియిల్లు సంగ్రహించుటచే కష్టముకలుగును.
6 ,, సుఖప్రసవ సంప్రాప్తిర్భవత్యేనాత్రసంశయః॥
,, సుఖప్రసవమగును సందేహమువలదు.
7 ,, ఏతత్సంబంధతోకష్టమాప్నోషి.త్యజసాంప్రతం॥
,, ఈసంబధముతో కష్టముకలదుగాన విడువుము.
8 ,, కూపేస్మిన్నుదకంసమ్యక్పతత్యేవ నసంశయః॥
,, ఈభావియందు చక్కగానీరుపడును సంశయములేదు
9 ,, కల్యాణమేతన్నిర్విఘ్నాత్ సంభవిష్యతిశీఘ్రతః॥
,, ఈవివాహము నిర్విఘ్నముగ జరుగును.
10 ,, విద్వాన్స్యభవేత్క్రమాదేషః అధునానైవసిద్ధ్యతే॥
,, వీడుక్రమశః విద్వాంసుడగును యిపుడుకాడు.
11 ,, అధునాప్రోషితస్యాస్య సుఖంనాస్తి క్రమాద్భవేత్॥
,, ప్రవాసికిపుడు సుఖములేదు క్రమశఃలభించును.
12 ,, కాలతోసస్యవృద్ధిర్హి భవేదిత్యేవరోచతే॥
,, కాలక్రమముగ సస్యవృద్ధియగునని తోచినది.

శిశోరాయుః ప్రవృద్ధౌ ... దృష్టం మహాకారణం।
తా॥ శిశువు ఆయువృద్ధివిషయమై నీఅదృష్టం కారణం
2 ,, సంతతిర్నభవేదద్య ప్రతిబంధవిశేషతః॥
,, ప్రతిబంధవశాదిపుడు సంతతికలుగదు.
3 ,, ఏతద్రోగనివృత్తిర్హి సావకాశేనసిధ్యతి॥
,, ఈరోగము సావకాశముగ నివృత్తియగును.
4 ,, నలభ్యతేధునావిద్యా క్రమశోవృద్ధిమాప్నుయాత్
,, ఇపుడు విద్యలభించదు క్రమశః వృద్ధియగును.
5 ,, బహుశఃజయమాప్నోతి పరీక్షాయాంనసంశయః॥
,, బహుశః పరీక్షలో జయించును.
6 ,, మేఘాడంబరతోవృష్టిర్నభవేదితి మేమతిః॥
,, మేఘాడంబరమునుబట్టి వృష్టికాదనితోచినది.
7 ,, రుణాద్విముచ్యతెసత్యం క్రమశోనైకదాభవేత్॥
,, క్రమశఃరుణవిముక్తియగును. ఒకేసారి కాదు.
8 ,, మాల్యవృద్ధిర్భవత్యేవ తతోక్షీణమవాప్నుయాత్।
,, వెలహెచ్చి పిమ్మట క్షీణించును.
9 ,, ఆశ్చర్యాల్లభతెద్రవ్యం నష్టమధ్యనసంశయః॥
,, నష్టద్రవ్యము ఆశ్చర్యముగలభించును సంశయంలేదు
10 ,, సాధారణేనవృద్ధిస్స్యాత్సస్యంనాతీవర్ధతే॥
,, సాధారణముగ సస్యవృద్ధియగును అతిగాకాదు.
11 ,, వరకన్యేనైవలభ్యేతస్మాత్తత్యాగవుత్తమః।
,, కన్యావరులు లభించరు ఆశవిడువుము.
12 ,, కార్యసిద్ధిర్భవత్యేవ తస్మాల్లాభోనవిద్యతే॥
,, కార్యసిద్ధిగలుగును అందుతో లాభము లేదు.

12

1 శ్లో॥ ఏతత్సంబంధతోనాస్తి సుఖాధిక్యంహి
తా॥ ఈసంబంధముతో కాలదోషతః అధిక్యములేదు.
2 ,, పశుస్తేనగతందూరం శీఘ్రమాయాతినాస్యథ
,, నీపశువుదూరమున లేదు శీఘ్రముగవచ్చును.
3 ,, ఏతద్విపద్భయందత్వా పరిహారం తతోభవేత్॥
,, ఈవిపత్తు భయమునిచ్చి పరిహారమగును.
4 ,, ప్రయాణేచాధునాకాలః నసమీచీనమస్తివై॥
,, ప్రయాణమునకిపుడు కాలముమంచిదికాదు.
5 ,, శిశోర్యుగళమస్తీతి మన్యేగర్భేద్యకాలతః॥
,, ఇపుడుకాలమునుబట్టి అముడబిడ్డలున్నారని తోచినది.
6 ,, భూగేహగ్రహణేచాద్య లాభోనాస్తిక్రమాద్భవేత్॥
,, ఇపుడు భూగేహములను పొందుటచే లాభము లేదు.
7 ,, సుఖప్రసవస్యవిషయే వక్తుంనార్హామిచాధునా॥
,, సుఖప్రసవవిషయము నిపుడు చెప్పజాలను.
8 ,, ప్రవాసీనోపయాతీహ శీఘ్రంత్యజమనోవ్యథాం॥
,, ప్రవాసిత్వరగారాడు చింతవలదు.
9 ,, ఉదకస్యసమృద్ధ్యాతు కూపోయంలాభదోభవేత్॥
,, నీటిసమృద్ధితో యీభావి లాభమునిచ్చును.
10 ,, వ్యాపారోయంలాభకారీ భవేదేవ నసంశయః॥
,, ఈవ్యాపారము లాభకారియగును సందేహము లేదు.
11 ,, కల్యాణవిషయేబాద్యకాలస్సమ్యక్ప్రవర్తతే॥
,, కల్యాణవిషయంలో కాలమిపుడు బాగాయున్నది.
12 ,, ప్రోషితస్య సుఖేచైవ త్యజచింతాంమనోగతాం॥
,, ప్రవాసిసుఖవిషయమై చింతవిడువుము.

13

శ్లో॥ ...భవేత్కార్యసిద్ధిః త్యజచింతాంమనోగతాం
తా॥ నీకు...కార్యసిద్ధికలుగదు. చింతవిడువుము.
2 ,, బాలోయం జీవితుంశక్తో తవయోగబలేన వై॥
,, నీయోగబలముచే యీబాలుడు బ్రతుకును.
3 ,, ప్రతిబంధబలాదద్య సంతానంజాయతేకథం॥
,, ప్రతిబంధబలముతో ఇపుడు సంతుయేలాగుకలుగు
4 ,, సంప్రాప్తైషా విపత్త్వాంతు పరిత్యజ్యకథంవ్రజే[త్]
,, ఈప్రాప్తవిపత్తు నిన్నువిడిచి యేలాగుపోవును.
5 ,, సమ్యక్ఫలంతిసస్యాని కాలదేశానుగుణ్యతః॥
,, దేశకాలానుగుణముగ సస్యము బాగాఫలించును.
6 ,, పరీక్షాయాంసావకాశాజ్జయీభవతినిశ్చయం॥
,, పరీక్షలో సావకాశముగ జయించును.
7 ,, వృష్టిస్సాధారణేనైవ భవేదితిచమేమతిః॥
,, సాధారణముగ వృష్టియగునని నా తాత్పర్యము.
8 ,, ఋణాద్విముక్తిరధునా నలభ్యాక్రమశోభవేత్.
,, ఇపుడు ఋణవిముక్తికాదు క్రమశఃఅగును.
9 ,, వృద్ధిర్భూయాచ్చమాల్యస్యచాధునాన్యూనతాంవ్ర[జేత్]
,, ఇపుడు వెలతగ్గి ముందువృద్ధియగును.
10 ,, తావకంయదినష్టంతదితరంకథమావ్రజేత్॥
,, నష్టసొత్తు నీదకాదు గనుకనే ఇతరులపాలయినది
11 ,, హరిప్రార్థనయాచైషః విద్వాన్భవతినిశ్చయం॥
,, వీడుహరిప్రార్థనచే విద్వాంసుడగును.
12 ,, లభ్యాకన్యావరాపశ్చాత్కురుయత్నమతంద్రితః॥
,, నీబలమైనయత్నముచే కన్యావరులు లభింతురు.

14

1 శ్లో॥ అయంప్రవాసీసౌఖ్యేనవర్తతేనాత్రసం...
తా॥ ఈప్రవాసిసుఖముగనున్నాడు సంశయములేదు.
2 ,, సఖ్యత్వంవ్యవహారేస్మిన్నావశ్యయుక్తం ప్రరోచతే
,, ఈవ్యవహారమునందు రాజీగాయుండుటయుక్తము.
3 ,, విద్యాలాభేతుకాలోయమసమీచీనమేవహి॥
,, విద్యాలాభమునకీకాలము యుక్తమైనదికాదు.
4 ,, శీఘ్రమారోగ్యతాంయాతి రోగిష్ఠోయంసుఖీభవ॥
,, వీడుత్వరలో రోగరహితుడౌను సుఖముగనుండుము.
5 ,, ఏతత్ప్రయాణవిషయే విఘ్నాశ్చబహవఃఖలు॥
,, ఈప్రయాణవిషయములో చాలావిఘ్నములుకలవు.
6 ,, పుత్రరత్నంభవేదస్యాః దైవయోగేనచాధునా,
,, దైవవశాత్ యీమెకు కొమారుడుగలుగును.
7 ,, భూగేహాసంభవేచాదౌ కష్టంపశ్చాత్సుఖంభవేత్॥
,, గృహభూలబ్ధిచే కష్టసుఖములుకలవు
8 ,, ప్రసవేవిషయేబాస్మిన్బాధామాత్రం భవిష్యతి॥
,, ఈప్రసవవిషయములో బాధమాత్రముకలదు.
9 ,, అధునానోపయాతీహ ప్రవాసీసుఖయోగతః॥
,, ప్రవాసి సుఖప్రాప్తివలన ఇక్కడికిరాడు.
10 ,, కూపస్యఖననేకష్టం జలాసంభవతోభవేత్॥
,, బావిత్రవ్వించుటవలన నీరులేక కష్టముగనుండును.
11 ,, ఉపయోగీభవేదేవ వ్యాపారోయంచనష్టకృత్॥
,, ఈవ్యాపారము నష్టకారికాదు వుపయోగించును.
12 ,, వివాహస్యచసంసిద్ధి రాశ్చర్యాత్సంభవిష్యతి।
,, ఆశ్చర్యముగ వివాహసిద్ధియగును.

1 శ్లో॥ కన్యావిచారస్తు విఘ్నాధిక్యాన్న కార్యకృత్।
తా॥ కన్యావరవిచారమందు విఘ్నములతో కార్యకారి కాదు
2 ,, విలంబాత్కార్యసిద్ధిస్తు సంభవిష్యతి నాన్యథా।
,, కార్యసిద్ధి సావకాశమున సంభవించును.
3 ,, గతోయం పశురాయాతి క్రమాద్దినచతుష్టయే।
,, ఈపోయిన పశువు నాలుగురోజులలో వచ్చును.
4 ,, వ్యవహారేవృథాయాసః పశ్చాదపజయో భవేత్।
,, ఈవ్యాజ్యమున వృథాయాసము జయములేదు.
5 ,, ప్రయత్నాద్విపదేషాహి పరిహార్యా న సంశయః।
,, ఈవిపత్తు యత్నతః పరిహారింపతగినది.
6 ,, విద్యాలాభః క్రమాదస్య సంభవేద్యత్నతః ఖలు।
,, ప్రయత్నతః విద్యక్రమశః లభించును.
7 ,, అస్మిన్నబ్దే పరీక్షాయాం సజయో న భవిష్యతి।
,, ఏకీసంవత్సరమున పరీక్షలో జయించడు.
8 ,, అధికావృష్టిరిత్యేవ సూచనా జాయతే ధునా।
,, వృష్టియధికముగ కురియునని తోచినది.
9 ,, ఋణాద్విముక్తిస్తే దోషాన్న సిధ్యతి కదాచన।
,, నీదోషముచే ఋణవిముక్తి సిద్ధించదు.
10 ,, న్యూనాభావేపి మాల్యస్య పశ్చాన్న్యూనం భవిష్యతి।
,, వెలతగ్గకపోయినను పిమ్మటతగ్గును.
11 ,, పాదాలబ్ధ్వాగతే చైతన్నష్టమిత్యవధారయ।
,, నష్టద్రవ్యము కాళ్ళువచ్చిపోయినట్లు తెలుసుకొనుము
12 ,, సంబంధోయం యుక్త ఏవ వ్రయాధిక్యాచ్చ లభ్యతే।
,, ఈసంబంధము యుక్తమేగాని వ్రయాధిక్యమగును.



1 శ్లో॥ కాలదోషాదద్య సిద్ధిర్వివాహస్య న యాతి వై।
తా॥ కాలదోషతః ఇపుడు వివాహసిద్ధి కలుగదు.
2 ,, ప్రోషితస్య సుఖం నాస్తి క్రమాత్సౌఖ్యం చ లభ్యతే।
,, ప్రవాసికిపుడు సుఖములేదు క్రమశః కలుగును.
3 ,, ప్రౌఢవైద్యాదయం బాలః ఆయుష్మాన్భవతి ధ్రువం।
,, ఈబాలుడు ప్రౌఢవైద్యులతో ఆయుష్మంతుడగును.
4 ,, సంతానప్రాప్తిరస్తీతి దృఢజ్ఞానమవాప్నుహి।
,, సంతుప్రాప్తికలదని దృఢముగా తెలుసుకొనుము.
5 ,, రోగోయం చిరకాలాచ్చ గ్రహచారాత్ప్రిభాధతే।
,, ఈరోగము బహుకాలముగ బాధించుచున్నది.
6 ,, ప్రయాణలాభో భవతి తస్మాచ్చింతామవాప్స్యసి।
,, ప్రయాణలాభముకలదు అందుతో చింతకలదు.
7 ,, కన్యారత్నస్య సంప్రాప్త్యా భాగ్యాభావం భవిష్యతి।
,, కన్యారత్నము కలుగును అందుచేభాగ్యములేదు.
8 ,, తవాదృష్టాద్భూమిగేహగ్రహణాన్మంగళం భవేత్।
,, నీయదృష్టముచే ఇల్లుభూములతో మంచియగును.
9 ,, సుఖప్రసవస్య విషయే త్యజ చింతాం సుఖం భవేత్।
,, సుఖప్రసవవిషయమై చింతవలదు సుఖమగును.
10 ,, అధునా నోపయాతీహ ప్రవాసీ గ్రహదోషతః।
,, ప్రవాసి గ్రహదోషవశాత్ యిపుడురాడు.
11 ,, ఆదౌనష్టప్రదోకూపః పశ్చాల్లాభప్రదో భవేత్।
,, భావితో ఆదియందునష్టము పిమ్మటలాభము.
12 ,, అల్పోపకారస్యాదేవ వ్యాపారోయం న నష్టదః।
,, ఈవ్యాపారముతో నష్టములేదు కొంచెములాభము

...భనుసారతో సస్యవృద్ధిః కుత్రాస్తి భూతలే।

తా॥ ప్రపంచమందు కోరినట్లు పైరువృద్ధి కాదు.

2 ,, ప్రయత్నా దేవలభ్యేతే వరకన్యే నచాన్యథా।

,, ప్రయత్నతః కన్యావరులు లభింతురు.

3 ,, కార్యసిద్ధౌ సుఖం నాస్తి తస్మాద్యత్నం త్యజాధునా।

,, కార్యసిద్ధియందు సుఖంలేదు యత్నంచాయవద్దు

4 ,, పశుస్తేనిర్గతో దూరం తస్మిన్నాశాం త్యజాధునా।

,, నీపశువు దూరంపోయినది. దానిఅశవిడువుము.

5 ,, అభ్యాసం సహసా కృత్వా విద్వాన్భవితుమర్హతి।

,, చక్కగాఅభ్యాసంచేసెనేని విద్వాంసుడగును.

6 ,, విపదేతత్పరిహార్యాభవే దేవనసంశయః।

,, ఈఆపద పరిహరింపతగినదిగా నున్నది.

7 ,, వ్యవహారే కాలదోషాత్ జయప్రాప్తిర్నవిద్యతే।

,, కాలదోషతః వ్యవహారము జయింపబడదు.

8 ,, అసమానమేతత్సంబంధమితిమత్వాత్యజవ్యథాం।

,, సంబంధము సరికాదని తలపకు చింతమానుము.

9 ,, వృష్టిరల్పాభవేదేవ దేశకాలానుసారతః।

,, కాలదేశానుగుణముగ అల్పవృష్టియగును.

10 ,, ఋణముక్తిమవాప్నోషి గర్వంత్యక్త్వాహరింభజ।

,, హరిశేవనచే ఋణవిముక్తియగును.

11 ,, సమోహయతివార్ఘ్యంహి బహూనాం కాలదోషతః

,, కాలదోషముచే ధరలు అందరిని మోసపెట్టును.

12 ,, గృహంత్యక్త్వానష్టవస్తు నబహిర్నిర్గతంహితత్।

,, నష్టవస్తువు ఇల్లువిడచి బయటవెళ్ళలేదు.



1 శ్లో॥ వ్యాపారాత్సంకటప్రాప్తిర్నాన్యల్లాభ...

తా॥ వ్యాపారముచే సంకటప్రాప్తియేగాని లా...

2 ,, వ్యయాధిక్యాచ్చకల్యాణం భవితవ్యం నచాన్యథా।

,, వివాహము అధికవ్రయముతో కావలెను.

3 ,, ప్రాయశస్సుఖమేవాస్తి ప్రోషితస్యసచాసుఖం।

,, ప్రవాసికి ప్రాయఃసుఖమేకద్దు దుఃఖములేదు.

4 ,, శిశోరాయుఃపరిజ్ఞానేనస్ఫురత్యధునామనః।

,, శిశువు అయుః పరిజ్ఞానవిషయమై తోచలేదు.

5 ,, క్రమాద్భవతిసంతానం ఆతురాన్నప్రయోజనం।

,, క్రమశఃసంతుకలుగునుఆతురంతో ప్రయోజనంలేదు

6 ,, ప్రాణాపాయభయంనాస్తి దీర్ఘజాడ్యత్వతోధునా।

,, దీర్ఘజాడ్యమగుటంబట్టి ప్రాణాపాయంలేదు.

7 ,, తవాదృష్టాదయంబాలః విద్వాన్భవతినాన్యథా।

,, ఈబాలుడు నీయదృష్టవశాత్ విద్వాంసుడగును.

8 ,, గర్భస్థపోతవిషయేహ్యధునామావిచారయ।

,, గర్భస్థశిశువిషయమై ఇపుడడుగవలదు.

9 ,, భూగేహగ్రహణాదద్య సమ్యగ్వక్తుంనశక్యతే।

,, భూగేహగ్రహణతః కీడుమేళ్ళను చెప్పవీలులేదు.

10 ,, పరీక్షాయామయంజిత్వా కీర్తిమాప్నోతినిశ్చయం।

,, వీడుపరీక్షలో జయించి కీర్తినిపొందును.

11 ,, ప్రవాస్యాగమనేకాల విలంబస్స్యాన్నసంశయః।

,, ప్రవాసిరాకనుగురించి కాలవిలంబమగును.

12 ,, కూపేజలంపతత్యేవ తస్మాల్లాభోపివిద్యతే।

,, బావిలోనీరుపడి అందుచేలాభంకలుగును.

శ్లో॥ [illegible]వ్యస్యవిషయే చింతాంత్యక్త్వాసుఖంవస॥
తా॥ [illegible]ష్టద్రవ్యవిషయమై చింతమాని సుఖముగనుండుము.
2 ,, యత్కించిత్ఫలతేసస్యం గ్రహచారవశాదిదం॥
,, ఈఫలము గ్రహవశాత్ యత్కించిత్ ఫలించును,
3 ,, కన్యావరౌ నలభ్యాహితసాద్యత్నంత్యజాదునా॥
,, కన్యావరులు లభించరు యత్నమును విడువుము.
4 ,, యత్కించిత్సావకాశాచ్చ కార్యసిద్ధిర్భవేదలం॥
,, యత్కించిత్సావకాశముగ కార్యసిద్ధియగును.
5 ,, గతంపశుంనశోచస్వసర్వంసిధ్యత్యదృష్టతః॥
,, గతపశువునుగురించి చింతవలదు దొరుకును
6 ,, వ్యాజ్యేస్మిన్కష్టమాప్యైవపశ్చాచ్చవిజయీభవేత్॥
,, ఈవ్యాజ్యము కష్టతః జయించును.
7 ,, ప్రాయశోభవతీహ్యద్య ప్రయాణం దైవయోగతః॥
,, దైవయోగముతో ప్రయాణములభించును.
,, పరీక్షాయాంప్రాయశోయంజయీస్యాన్నాత్రసంశయః
,, వీడుపరీక్షలో ప్రాయఃజయించును.
9 ,, సంబంధోయం సమీచీనః పశ్చాత్కలహకృద్భవేత్
,, యీసంబంధముమంచిదేగాని పిమ్మట కలహప్రదము
10 ,, భగవత్కృపయాచైషా సుఖేనైవప్రసూయతే॥
,, శ్రీకృపతో యీపెసుఖముగ ప్రసవించును.
11 ,, రుణముక్తిమవాప్నోషిత్వాదృష్టవశాత్ఖలు॥
,, నీయదృష్టవశాత్ రుణవిముక్తియగును.
12 ,, న్యూనాధిక్యేసమాహార్యే కాలదేశానుసారతః॥
,, వెల కాలదేశానుసారముగ హెచ్చుతగ్గులౌను.



1 శ్లో॥ కూపస్యఖననేనష్టం నాయాస్యతిజల[illegible]
తా॥ భావిత్రవ్వించుటచే నీరుపడును నష్టమురా[illegible]
2 ,, ప్రాయోపయోగీస్యాద్దేవవ్యాపారోయంన[illegible]
,, ఈవ్యాపారతః బహుతరా వుపయోగమేను.
3 ,, పరాజయజయౌచాస్మిన్వ్యవహారేసమావుభౌ॥
,, ఈవ్యవహారమునందు జయాపజయములు సమము.
4 ,, ప్రోషితంప్రతిమాపృచ్ఛ ప్రశ్నమస్మిన్దినేశుభే॥
,, ఈదినము ప్రవాసివిషయమై ప్రశ్నయడుగకుము.
5 ,, క్రమాత్ప్రవర్ధతేచాయుః శిశోరస్యచకష్టతః॥
,, ఈశిశువుఆయుస్సు కష్టతఃవృద్ధిఅగుచున్నది.
6 ,, ప్రాయఃప్రవృద్ధిమాయాతి సస్యంకాలాద్గతాదపి॥
,, కాలతః చెడినప్పటికి తిరిగి పైరువృద్ధిపొందును.
7 ,, ఏతద్రోగనివృత్తౌతు పరమాశ్చర్యమాప్స్యసి॥
,, ఈరోగనివృత్తివిషయమై ఆశ్చర్యమును పొందెదవు.
8 ,, విద్యావిషయికఃప్రశ్నః పశ్చాత్కర్తుమిహార్హసి॥
,, విద్యావిషయమైనప్రశ్న పిమ్మటచేయుము.
9 ,, అస్మాద్గర్భాత్సుందరాంగః పురుషస్సంప్రజాయతే॥
,, యీగర్భతః సుందరపుత్రుడు కలుగును.
10 ,, ఫలోపయోగీవృష్టిస్స్యాదితి మేరోచతేమనః॥
,, ఫలోపయుక్తవృష్టియగునని నాకుతోచినది.
11 ,, క్రమశోవిజయీభూయాత్పరీక్షాయాంనచాధునా॥
,, ఇపుడుపరీక్షలో జయించడు. క్రమశః అవును.
12 ,, అధునానోపయాతీహప్రవాసీకార్యగౌరవాత్॥
,, ప్రవాసి కార్యగౌరవమునుబట్టి యిపుడురాడు.

,, ఋణ[illegible]వృద్ధిర్హ్యానతాంతు యా త్యేవనచవర్ధతే॥
తా॥ ఋణ హెచ్చుట తగ్గు నేకాని హెచ్చిపోదు.
,, నష్టమేతల్లభేద్యత్నాత్ కాలతో నాత్రసంశయః॥
,, నష్టద్రవ్యముయత్నతః నిస్సంశయముగదొరకును.
3 ,, వ్యాపారాన్నష్టమాప్నోషిత్యజతద్విషయేస్పృహాం॥
,, వ్యాపారతః నష్టముకలుగునుగాన ఆశవిడువుము.
4 ,, కన్యావరౌప్రయత్నాచ్చలభ్యావేవనసంశయః॥
,, కన్యావరులు ప్రయత్నతః లభింతురు.
5 ,, కార్యానుకూలేచాపపత్తిరధునానైవవిద్యతే॥
,, ఇపుడు కార్యానుకూలమునందు వుపపత్తి లేదు.
6 ,, సంతానవృద్ధిర్భవతనాత్రకార్యావిచారణా॥
,, సంతానవృద్ధియగును విచారపడవలదు.
7 ,, విపదేతన్నాశమేతికష్టతో నాత్రసంశయః॥
,, ఈవిపత్తుకష్టపెట్టి పరిహారమగును.
,, ప్రయాణాసంభవేలాభః నొచేత్కష్టమవాప్స్యసి॥
,, ప్రయాణముతప్పుటచే లాభమగును.
9 ,, పరీక్షాసుఖసంప్రాప్త్యై హరింప్రార్థయనాన్యథా॥
,, పరీక్షప్యాసుకొరకు శ్రీహరిని భజించుము.
10 ,, భూగేహగ్రహణేచాశాంలాభాభావాత్త్యజాధునా॥
,, భూమియిల్లుతీయునెడ మేలులేదు ఆశవిడువుము.
11 ,, ప్రసవేస్మిన్సుఖావాప్త్యైప్రార్థనాంకురుమాధవం॥
,, సుఖప్రసవవిషయమై శ్రీహరిని ప్రార్థనచేయుము.
12 ,, ఋణముక్తిఃప్రయత్నేనలభ్యతేసంశయంత్యజ॥
,, ప్రయత్నతః ఋణవిముక్తియగును.



1 శ్లో॥ ప్రవాసీనాధునాయాతి కార్యార్థీసంచ[illegible]
తా॥ ప్రవాసి కార్యగౌరవమునుబట్టి రాడు.
2 ,, కూపారంభేనష్టమేత్య జలంలబ్ధ్వాసుఖీభ[illegible]
,, భావితోనష్టపడి జలప్రాప్తితః సుఖంగలుగు[illegible]
3 ,, వివాహోయంయత్నసాధ్యఃవిఘ్నప్రాచుర్యతో ధ[illegible]
,, ఈవివాహము విఘ్నపడి పిమ్మటసిద్ధించును.
4 ,, యత్కించిత్సస్యవృద్ధిస్స్యాన్నభవత్యధికంఫలం॥
,, యత్కించిత్ ఫలించును అధికఫలంకాదు.
5 ,, ప్రవాసీసుఖమాప్నోతి యత్నతః ప్రతిబంధకాత్॥
,, యత్నతః ప్రతిబంధమువిడిచి ప్రవాసిసుఖపడును.
6 ,, ఆయుర్వృద్ధ్యాశిశోరస్య శ్రీశంభజనచాన్యథా॥
,, శిశువుకాయుర్వృద్ధివిషయమై శ్రీహరినిభజించుము.
7 ,, సంతానవిషయేయత్నం కురుతస్మాదవాప్స్యసి॥
,, ప్రయత్నతః సంతానవృద్ధియగును.
8 ,, నివృత్తిరేషారోగస్య అన్యసాహాయ్యకాంక్షిణః
,, అన్యసహాయముచే రోగనివృత్తియగును.
9 ,, ప్రాయోలభ్యఃపశురయం భ్రమంత్యక్త్వాహరింభజ
,, ఈపశువు హరిసేవచే ప్రాయఃలభించును.
10 ,, భవితవ్యాపుత్రికాతుహ్యదృష్టాత్తవచాధునా॥
,, నీయదృష్టముచే పుత్రికజన్మించును.
11 ,, వృష్టిర్హిభవితాసమ్యగ్నాస్తితస్మాత్ప్రయోజనం॥
,, బాగావృష్టియైనను ప్రయోజనంలేదు.
12 ,, పరీక్షాయాంజయీభూయాత్సద్యఏవనసంశయః॥
,, పరీక్షలో యిప్పుడేజయించును.

శ్లో॥ ...త్యజవిశ్వాసం ఋణముక్తశ్శ్రమీభవ॥
తా॥ ఏషవిముకియందు అనృష్టమునితలపక శ్రమించుము.
,, స్వజభాగ్యంతించమా లేవ్యస్మిన్ దైవాత్సమ్యగ్నవర్ధతే॥
,, వెలవిషయమై భగ్రమవిడువుము వృద్ధి కాదు.
3 ,, అతీవయత్నతో వాప్యం నష్టద్రవ్యం నచాన్యథా॥
,, నష్టద్రవ్యము అతిప్రయత్నతః లభించును.
4 ,, వివాహసిద్ధిర్భవతి తస్మాత్సంతోషమాప్నుహి॥
,, వివాహసిద్ధియై సంతోషపడుదువు.
5 ,, కన్యావరాయత్నలభ్యాత్తస్మాద్బాధాపివర్తతే॥
,, యత్నతః కన్యావరులు లభింతురు బాధయుకలదు.
6 ,, కార్యసిద్ధిర్భవేదేవయత్నతో నాత్రసంశయః॥
,, యత్నతః కార్యసిద్ధియగును సందియములేదు.
7 ,, విషయేతుపశోరస్యశోధితవ్యంప్రయత్నతః॥
,, పశువువిషయమై యత్నతః శోధించవలెను.
8 ,, అస్మిన్నావ్యాజ్యేజయప్రాప్తిర్భవితవ్యేతి మేమతిః॥
,, ఈవ్యాజ్యమునందు జయముకలుగునని తోచినది.
9 ,, ఏతత్ప్రయాణంయత్నేన లభ్యమేవనసంశయః॥
,, యత్నతః ప్రయాణము లభించును.
10 ,, సంబంధవిషయేచాద్య ప్రశ్నంమాకురుమానసి॥
,, సంబంధవిషయమై యిపుడు ప్రశ్నచేయవలదు.
11 ,, భూగేహసంగ్రహేచాదౌ నష్టంలాభస్తతఃపరం॥
,, భూగృహప్రాప్తితో నష్టపడి ఆవలలాభమగును.
12 ,, సుఖేనప్రసవంయాతి తస్మిన్చింతాంత్యజాధునా॥
,, సుఖప్రసవమగును, ఆవిషయమై చింతవలదు,



1 శ్లో॥ పరీక్షాయాంజలాభూతాల్లాభాధిక్య...
తా॥ పరిత్యుప్తపాయసువలన అధికలాభములేదు.
,, ప్రవాసీశీఘ్రమాయాతి త్యజచింతాం...
,, ప్రవాసి శీఘ్రముగావచ్చును చింతవలదు.
3 ,, కూపప్రయత్నమధునాత్యక్త్వాపే కాలాంతరేకురు॥ ...
,, ఇప్పుడు భావిప్రయత్నమునువిడిచి పిమ్మటచేయుము.
4 ,, వ్యాపారాదస్తికింనాన్యదుపయోగీమహీతలే॥
,, వ్యాపారముకంటె లాభకరమైనది మరియొకటి లేదు.
5 ,, వ్యవహారేజయంప్రాప్య మోదమేతినసంశయః॥
,, వ్యవహారమందుజయించి సంతోషించును.
6 ,, అధునాప్రోషితోయంహి దుఃఖీపశ్చాత్సుఖీభవేత్॥
,, ఇప్పుడు ప్రవాసిదుఃఖపడి పిమ్మట సుఖపడును.
7 ,, ఆయుర్భాగ్యాదిసంపన్నో శిశురేషనసంశయః॥
,, ఈశిశువు ఆయుర్భాగ్యాది సంపన్నుడు.
8 ,, ప్రయత్నాత్పరిహర్తవ్యా విపదేతత్త్యజవ్యథామ్॥
,, ఈవిపత్తు యత్నతః పరిహరింపతగినది.
9 ,, కాలోయంనసమీచీనః పశ్చాద్విద్యాభివర్ధతే॥
,, మంచికాలముకాదు మరల విద్యావృద్ధియగును.
10 ,, కల్యాణమధునాఽలభ్యం క్రమాత్సంభవతిధ్రువం॥
,, ఇపుడు పెండ్లికాదు క్రమముగ సిద్ధించును.
11 ,, సంబంధాల్లాభ ఏవ స్యాత్కస్మాత్త్వంపరిపృచ్ఛసి॥
,, యీసంబంధముతో లాభమేను ప్రశ్నవలదు.
12 ,, భూగేహసంభవాల్లాభో భవత్యేవనసంశయః॥
,, భూగృహలబ్ధితో లాభమగును.

"...శ్చేన్నస్మిన్కాలాత్సమ్యక్ న దృశ్యతే॥

తా॥ ప్రసూతి ప్రశ్నవిషయమైన ప్రశ్నకు కాలము నుంచిదికాదు

" ఋణముక్తిర్గ్రహవశాద్భవిష్యతిన సంశయః॥

" గ్రహచారవశాత్ ఋణముతీరును సందేహములేదు.

" మూల్యేవ్యత్యాసమస్త్యేవ కించిత్కాలానుగుణ్యతః

" కాలానుగుణముగ వెలలు వ్యత్యాసముగనుండును.

" నష్టద్రవ్యమిదంలబ్ధ్వా పునఃకాలేనగచ్ఛతి॥

4 " ఈనష్టద్రవ్యములభించి చక్రముగ తిరిగిపోవును.

" వ్యాపారాల్లాభ ఏవస్యాన్నతునష్టిర్భవిష్యసి॥

5 " వ్యాపారముతో లాభమేకాని కష్టమురాదు.

" నప్రాప్స్యేవరకన్యేతు చింతాంత్యక్త్వాసుఖీభవ॥

6 " కన్యావరులు లభించరు చింతమాని సుఖపడుము.

" కార్యసిధ్యాసుఖంనాస్తి సిద్ధిర్భూత్వాపిదుఃఖదా॥

7 " కార్యసిద్ధిచే సుఖములేదు సిద్ధించినను దుఃఖమేను.

" సంతానంనభవత్యేవ విచారంత్యజచాత్మని॥

" సంతానంకాదు విచారపడవద్దు.

" అస్మిన్రోగవిచారేతు భీతింత్యక్త్వాహరింభజ॥

9 " ఈరోగినిగురించి భయపడక శ్రీహరిభజనచేయుము.

" ప్రయాణలాభోభవతి తస్మాన్నష్టం ప్రయాస్యసి॥

10 " ప్రయాణలాభమగును అందుచేనష్టంకలుగును.

" గర్భాదస్మాత్పుత్రఏవ జాయతేచనకన్యకా॥

11 " యీగర్భతః పుత్రలాభమగును కన్యకాదు.

" భవితవ్యాసువృష్టిర్హి గ్రహాణాంగతియోగతః॥

12 " గ్రహగతివలన సువృష్టియగును.

"

1 శ్లో॥ ప్రోక్తంహిశంభునా చైతద్గుహ్యాద్గుహ్యతరం

పరీక్ష్య యోగ్యతాంసమ్యగుపదేష్టవ్యంహిశ...

తా॥ శ్రీపరమేశ్వరప్రోక్తమై యీగుహ్యశాస్త్రము శిష్యులయోగ్యతను పరిక్షించి వుపదేశించాయవలెను.

" అన్యథావ్యర్థమాయాతి శిష్యాణాంభువిపార్వతి॥

భక్తితోఫలమాప్నోతి పృచ్ఛకోనాత్రసంశయః॥

తా॥ ఆలాగుకాదేని వ్యర్థమగును పృచ్ఛకుడు శుభాశుభఫలములను పొందుటకు భక్తియేకారణము.

3 " ఏతద్ధినోపదేష్టవ్యంమూర్ఖాయచశఠాయవై॥

హరిభక్తివిహీనాయనాస్తికాయగురుద్విషే॥

తా॥ దీనిని మూర్ఖుడు, శఠుడు, హరిభక్తిరహితుడు, నాస్తికుడు, గురుద్వేషీ ఇట్టివారికి వుపదేశించతగదు.

4 " బ్రహ్మద్వేషీరోగిణేచ సదాచారోజ్ఝితాయచ॥

పితృమాతృద్విషే చైవ పంచయజ్ఞోజ్ఝితాయచ॥

తా॥ బ్రహ్మద్వేషి రోగి సదాచారవర్జుడు, మాతాపితృద్వేషి పంచయజ్ఞములను విడిచినవాడు వీరికుపదేశించరాదు.

5 " ఏతచ్ఛివేనసంప్రోక్తం పార్వత్యైశాస్త్రముత్తమం॥

మునినాశుకనామ్నావైరచితంతత్తిరోహితం॥

తా॥ శ్రీపరమేశ్వరుడు పార్వతీదేవిగారికి వుపదేశించిన యీశాస్త్రమును శుకమునులవారు రచియించగ నదియిపుడు ఖిలపడిపోయినది

6 " తదిదంతుమయాసమ్యగ్జ్ఞాతంబుద్ధికౌశలాత్॥

లోపమేతద్గతంసంతఃక్షమ్యతామితియాచయే॥

తా॥ దానినిబుద్ధికౌశల్యముచే సంగ్రహించి శాస్త్రమునుపూర్తిని ఇందుగలలోపములనుగురించి మహనీయ్యులు క్షమించవలెను

,, ...శ్లవరవంశజ రామనామ్నఃపుత్రేణపండితవరస్య
,, ...కస్య! కృష్ణాహ్వయేనరచితంకిలప్రశ్నశాస్త్రమేతే
,, ...ష్టముపయాతురమాధినాథః॥
;; ...త్తమ గాడిచర్లవంశజులైనశ్రీరామరావుగారి కుమారుడు
కృష్ణరావుగారిచే రచితమైన యీశాస్త్రముచే శ్రీహరిప్రీ
తిని పొందవలెను.

,, మంగళంకౌసలేంద్రాయ మంగళం కృష్ణమూర్తయే।
,, మంగళంవ్యాసరూపాయ మంగళంపరమాత్మనే॥
శ్రీరామ, కృష్ణ, వేదవ్యాస, పరమాత్మరూపులను మంగళం
కలుగవలెను.

ఇతి శ్రీమనోగతప్రశ్నే ద్వితీయ్యభాగస్సమాప్తః
ఇతి శ్రీమద్భగవద్భక్తతిలక శ్రీమధ్వాచార్య ప్రియశిష్య
గాడిచర్ల రామరాయసుత కృష్ణరాయప్రణీతం మనోగతప్ర
శ్నోత్తరప్రకాశికాఖ్య ప్రశ్నశాస్త్రం సమాప్తిమగమత్॥
ఇతిశ్రీభగవద్భక్తాగ్రగణ్యుడును, శ్రీమధ్వాచార్యులవారి ప్రియశిష్య
లనగు గాడిచర్ల రామరావుగారి పుత్రుడైన కృష్ణరాయులచే
రచితమైన మనోగత ప్రశ్నోత్తర ప్రకాశికాఖ్య
ప్రశ్నశాస్త్రము సంపూర్ణమాయెను.
శ్రీవెంకటేశార్పణమస్తు.



# ప్రొద్దుటూరు

మావద్ద అన్నివిధములైన తెల్లకాగితములు, స్టేషనరి సామానులు, అమృతాంజనము, ఫౌంటెన్ పెన్నులు, ప్లేట్ పెనాలు, స్వాన్ యింకిబుడ్లు, స్లేటులు... వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి గ్రంథములు. ఆనందా, ... రా, సరస్వతి, రామాఅండ్కోవారి గ్రంథములు, ... కొలను సుబ్బరావుగారి ఆర్యకథానిధి మొదలగు అన్నిగ్రంథములు, ఎలిమెంటరీ, సెకెండరీస్కూళ్ల అన్నిగ్రంథములు, ...టకములు, నవలలు, పద్యకావ్యములు, వైద్య గ్రంథములు, రోజుకతామణి మొదలగు బైండు పుస్తకములు, సోడాషా ...పులకు కావలసినగ్యాసు, మొకలు, అన్ని చిల్లరసామానులు, గాజుసామానులు, అనగాచెంబులు, లోటాలు, పూలతొట్లు, లాందర్లు, ల్యాంపులు, అన్నిల్యాంపులకుచిమ్నీలు, ...రాఅన్నివస్తువులు, సరసముగా మవరాసు వెలలకుదొరుకును.

ఒక్క సారి మాసరకులనుకొనిన, మావస్తువుల నాణ్యమును, ధరవిషయమును మీకే తెలియును. పరీక్షించిచూడుడు.

బద్వేలి షేకుహుశేన్ దాసుగారి
## అచలఅనుభవవేదాంత తత్వములు.

ఈగ్రంథమున మతభేదములు లేక ప్రపంచమున అనుభవములోనున్న వేదాంత విషయములను తత్వములుగరచియించియున్నారు. శ్రీవాస ...స్తాన్ షరీఫ్ సాహెబ్ ఖాద్రీగారిచే రచియింపబడిన శ్రీవీరాంజనేయస్తుతి ...ములు హుశేన్ దాసుగారి ఛాయాపటముతో సహాయింపుగలవు.

వెల 0-6-0 మాత్రమే

"ఆరో... కర్త: సుప్రసిద్ధ వైద్యపండిత. లోకరాజు,

వసంతపురం మునయ్యగారు.

...నుష్యునకు ఆరోగ్యమే ప్రధానము. అట్టి ఆరోగ్యములేక, సకల ఐశ్వర్యములు గలిగిన మానవుని జీవితము వ్యర్థము. ఇక్కాలమునన్, పలు విధములైన క్రొత్తవ్యాధులు ప్రబలుచున్నవి. ఇట్టితరి ప్రతితూరి వ్యాధిన ...డును మీరు వైద్యులకొరకు వెదకి కొనుచు బోవలెననిన మిక్కిలి ...శ్చార్యము. మా అనుభవచికిత్సాదర్పణమును మీరు కలిగియుండిన ...డాను వైద్యులతో పనియే యుండదు. కొంచెము చదువువచ్చిన ...తును, ఈపుస్తకపు సహాయమున తనకు తానే ఎట్టి రోగమునకైన ...శాస్త్రోక్తమైన ఔషధమును జేసుకొనగలుగును. ఇందు చెప్పబడిన ...ములన్నియు అనుభవములోనివే, ఒక్కొక్క రోగమునకు. 5,6,రకము ...త్సలు చెప్పబడియున్నవి. ఈగొప్పగ్రంథము వైద్యులకు విగుల సహా ...రిగ నున్నదని అనేకులు పొగడియున్నారు.

వెల. రు. 2—8—0 క్యాలికో. 3—0—0

---

# విష ప్రతివిష మంజరి

బ॥ లోకరాజు వసంతపురం. మునయ్యగారు.

ఈగ్రంథము మితిమీరి భుజించిన ప్రతివస్తువునకును విరుగులను తేటతెలుగు పద్యములుగా వ్రాయబడినది అన్నివిధములయిన గడ్డదినుసులు, కూరగాయలు, పలువిధములయిన ఫలములు, అన్నిమాంసములు, విషపదార్థములు తేలు, పాము, జెర్రి, మొదలగు విషజంతువులు. చీమలు, దోమలు, నల్లులభాధలను దొలగించు పద్ధతులను వ్రాయబడినది. యివియవియనసేల ప్రపంచమున సామాన్యముగ దొరకు అన్నివస్తువులును పొరపాటునభుజించినఅన్నిటికిని విరుగులను కాపులేని మామిడిచెట్లకు కాపునిచ్చు పద్ధతులును కూడను ఈగ్రంథమున చక్కగవ్రాయబడినది.

ఇట్టిగ్రంథము తెనుగుభాషలో దొరకుటదుర్లభము ఈగ్రంథము వైద్యులకేకాక అందరకును చాలాముఖ్యమైనది వెల రు 0—8—0

వలయువారు:—

జనోపకారిణిస్టోర్సు, ప్రొద్దుటూరు. అనివ్రాయుడు.